# మన పదులు

[భాగం 2]



రచన:

కెంటాల గోపాలకృష్ణ



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

B

# ఇందులో

* చీనాబ్
* రావి
* బియాస్
* సట్లెజ్
* సోన్
* కోసీ
* సరయూ
* గండకి
* శిప్రా

మన దేశ పరిచయాన్నిచ్చే

# నవీన బాలసాహిత్యం

మన చారిత్రక ప్రదేశాలు (4 భాగాలు) భాగం 1కి 0–87

రచన : రెంటాల గోపాలకృష్ణ

మన పుణ్యక్షేత్రాలు (2 భాగాలు) భాగం 1కి 0–87

రచన : దంటు కృష్ణమూర్తి

మన నగరాలు (4 భాగాలు) భాగం 1కి 0–87

రచన : రెంటాల గోపాలకృష్ణ

మన నదులు (4 భాగాలు) భాగం 1కి 0–87

రచన : రెంటాల గోపాలకృష్ణ

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# చీనాబ్

జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్ - ఈ అయిదునదులూ పంజాబునదు లంటారు. ఈ అయిదు నదులూ చేతి వ్రేళ్ళలాగా విస్తరించిఉండడంచేత—ఆ ప్రదేశానికి పంజాబు అని పేరువచ్చింది. ఈ పంచనదులూ సింధునదికి ఉపనదులు. చాలా ప్రాచీనమైనవి. మన వేద వాఙ్మయంలో వీటినిగురించి పేర్కొనబడింది.

చీనాబ్‌నదిని వేదాలలో అసిక్ని అనీ, పురాణాలలో చంద్రభాగ అనీ వర్ణించారు. జీలంనదికి వితస్త అనీ, రావీనదికి పరుష్ణి లేక ఐరావతి అనీ, బియాస్‌నదికి విపాశ లేక అర్జికీయ అనీ,సట్లెజ్‌నదికి శతద్రు అనీ-మన ప్రాచీన వాఙ్మయంలో పేర్లు. గ్రీకులు జీలమ్‌ను హైడసపెస్ అనీ, బియాస్‌ను హైపసిస్ అనీ, సట్లెజ్‌ని హూఫసిస్ అనీ, చీనాబ్‌ను అకెసినెస్ అనీ, రావిని హైడ్రొయేట్స్ అనీ పేర్కొన్నారు.

ఋగ్వేదంలో ఒక ఋక్కు ఇలా చెపుతున్నది—
'ఓ మరుత్తులారా! మిమ్మల్ని సంతుష్టిపరచడానికి అద్భుతమైన యజ్ఞాలుచేస్తున్నాం. మీరు మాకు సింధు, అసిక్ని నదులలోనూ, పర్వతాలలోనూ ఉండే సమస్త ఓషధులనూ తెచ్చి ఇచ్చి, మమ్మల్ని రోగవిముక్తులుగా చెయ్యండి—

అసిక్ని అనగా నలుపువర్ణము. చీనాబ్‌నదిలోని

నల్లటినీరువలన ఈ పేరు పెట్టబడింది. ఋగ్వేదం సప్త నదులను ముఖ్యమైనవిగానూ, మరో మూడునదులను ఉప నదులుగానూ పేర్కొన్నది. అవి ఇవి—గంగ, యమున, సరస్వతి, శతద్రు (సట్లెజ్), పరుష్ణి (ఐరావతీ లేక రావి), అసిక్ని (చంద్రభాగ లేక చీనాబ్), మరుద్వృధ, వితస్త (జీలం), సుషోమ, అర్జికీయ (విపాశ లేక బియాస్), ఈ పది నదులలో మరుద్వృధనుగురించి—అది ప్రత్యేకంగా ఒక నదికాదనీ, తక్కినననదులు వాయువేగంవలన పొంగి నప్పుడు ఏర్పడే ప్రవాహమనీ యాస్కుడు చెప్పాడు. తక్కినవారి అభిప్రాయంప్రకారం మరుద్వృధ చీనాబ్ నదికి ఉపనది అనీ, కాశ్మీరంలో ప్రవహిస్తున్నదనీ తెలు స్తున్నది. ఋక్కుల్లో పేర్కొనబడిన సుషోమనది సింధు నదియేనని యాస్కుని సిద్ధాంతం. మరి తక్కిన పండితు లేమో, సుషోమనది రావల్పిండి జిల్లాలో ప్రవహించే సోహన్ లేక సువాన్‌నది అని అంటున్నారు.

ఏమైనప్పటికీ ఈ అయిదునదులూ పంజాబులో ప్రవహించి, చివరకు అన్నీ సింధునదితోనే కలిసిపోతు న్నాయి. 'మిళిందుని ప్రశ్నల'లో ఇండియాలో గొప్ప నదులు పది అని పేర్కొనబడింది. ఆ పదింటిలో చంద్ర భాగ (చీనాబ్)కూడ ఒకటి. మహాభారతం, సభాపర్వంలో నారదుడు, ధర్మరాజుకు దిక్పాలకులసభలు వర్ణించిచెప్పాడు. వరుణదేవునిసభను వర్ణిస్తూ అక్కడ గంగ, యమున, సరస్వతి, విపాశ, శతద్రు, ఐరావతి మొదలగు నదు

లున్నట్లు చెపుతూ చంద్రభాగనుకూడా చేర్చి చెప్పాడు. మహాభారతం, అనుశాసనిక పర్వంలో—భీష్మాచార్యుల వారు ధర్మరాజుకు-అనేకనదులనుగురించీ తీర్థమహాత్మ్యాలను గురించీవర్ణించిచెప్పాడువాటిలోచంద్రభాగ(చీనాబ్)విషయం కూడాచెప్పాడు. 'విశాలతరంగాలుగల చంద్రభాగలోకానీ, వితస్త (జీలం)లో కానీ ఏడురోజులు నిరాహారుడై ఎవడు స్నానంచేస్తున్నాడో వాడు నిర్మలుడై, మునులుపొందే ఉత్తమగతిని పొందుతున్నాడు'

'కాశ్మీరమండలంలో మహానదమగు సింధునదంలో ఏ ఏ నదులు కలుస్తున్నాయో ఆ నదులందు స్నానమాచరించినవాడు శీలవంతుడై, స్వర్గానికి వెడుతున్నాడు'

మహాభారతం భీష్మపర్వంలో శతద్రు యమున,నదులతో పాటు చంద్రభాగ, అసిక్నినదులుకూడ పేర్కొనబడినాయి. భాగవతంలోనూ స్కాందపురాణంలోనూప్రధానమగునదుల పేర్లు చెప్పబడినాయి. వాటిలోచంద్రభాగ, శతద్రునదులు న్నాయి. అయితే ఇక్కడొక చిన్న చిక్కుఉన్నది.కృష్ణానదికి ముఖ్యఉపనదిఅగు భీమనదికిపండరిపూర్‌వద్ద చంద్రభాగ అనిపేరుఉన్నది. మరిచంద్రభాగఅన్నప్పుడు ఏచంద్రభాగ?-కృష్ణానదికి ఉపనదిఅగు భీమనదియాలేకసింధునదికి ఉపనది అగు చీనాబ్‌నదియా?—ఈ విషయంలో కొందరు తికమకపడవచ్చును. కాని మన పురాణాలు జాగ్రత్తగా చదివి పరిశీలించినవారికి ఈ చిక్కురాదు. పురాణాలలో చంద్రభాగను పేర్కొన్నప్పుడు - రెండువిధాలగా పేర్కొన

డంజరిగింది. కొన్నిచోట్ల నర్మద, తపతి—నదులతోపాటు చంద్రభాగపేరు వచ్చింది, కొన్నిచోట్ల శతద్రు, వితస్త విపాశ, మరుద్వృధ — నదులతోపాటు చంద్రభాగను పేర్కొనడం జరిగింది. కనుక దీనినిబట్టి నర్మదా, తపతీ నదులతోపాటు చెప్పిన చంద్రభాగ, భీమనదిఅనీ - శతద్రు వితస్త మొదలయినవాటితో చెప్పిన చంద్రభాగ పంజాబులో సింధునదికి ఉపనదియగు చీనాబ్ అనీ,మనం స్పష్టంగా తెలుసుకోవచ్చును.

పంజాబునదులు అయిదూ గొప్ప పుణ్యనదులనీ- ఈ నదులలో స్నాన, దాన, శ్రాద్ధాదికర్మలు ఆచరించిన వారికి అమితమైన పుణ్యంలభిస్తుందనీ మన పురాణాలు చెపుతున్నాయి. చీనాబ్ లేక చంద్రభాగనుగురించి మత్స్య, నారద, నీలమత పురాణాలలోనూ హరభరిత చింతామణి లోనూ చెప్పబడింది.

చీనాబ్‌నది హిమాలయపర్వత ప్రాంతాలలో పంజాబు లోని లాహుల్ జిల్లాలో పుట్టింది. రెండు పాయలయి ప్రవహించింది. ఒకపాయపేరు చంద్ర. అది 'బారాలచ్చా' సమీపంలో, 16 వేల అడుగుల ఎత్తున ఒక మంచు మడుగులో పుట్టింది. రెండవపాయపేరు భాగ. అదిమొదటి దానికి వాయువ్యమూలగా పుట్టింది. చంద్ర, భాగ—అను ఈ రెండు ప్రవాహాలూ 'తాండి' అనే ప్రదేశంలో కలుసు కుంటాయి. అక్కడనుంచి చంద్రభాగ అను పేరుతో పంజాబు, హిమాచలప్రదేశ్, జమ్ము, కాశ్మీరురాష్ట్రాల

గుండా ప్రవహించి తరవాత పాకిస్థాన్‌లోగుండా పోతుంది. ఈనది మొత్తంమీద మూడు మలుపులు తిరిగింది. ప్రతి మలుపులోనూ ఒకటి, రెండు ఉపనదులను కలుపుకుంటూ వచ్చింది. దీని ఉపనదులలో ముఖ్యమైనవి యూనియర్, మూవీ, భూత్నా, మరువరద్వాన్ అనునవి. తరవాత గోలన్‌లాగ్, లీవర్‌కోల్, బిస్లారీ, అన్స, అను చిన్న నదులు వచ్చి కలుస్తాయి. ఆ తరవాత తావి అను చిన్న నది వచ్చి చేరుతుంది. జీలంనది వచ్చి త్రిమ్మూ—అనుచోట చీనాబ్‌నదితో కలుస్తుంది. అక్కడనుంచి ఈ రెండునదులు కూడా చీనాబ్‌నది అనుపేరుతోనే ప్రవహిస్తాయి. అది అలా వచ్చి వచ్చి, సిధూ అను ప్రదేశంలో రావీనదిని కలుస్తుంది. అటుపిమ్మట మద్వాలా అనుచోట సట్లెజ్‌నదిని కలుపుకుంటుంది— ఇలా అన్నీ కలిసిన ప్రవాహం పంచనదం—అనుపేరు వహించి—చివరకు మితాన్‌కోట్‌వద్ద సింధునదితో కలిసిపోతుంది.

చీనాబ్ నదీప్రవాహమార్గం—ముఖ్యంగా మైదాన భూముల్లో చాలా విశాలంగానూ, ఇసుకమయంగానూఉన్నట్లున్నూ, ఈ ప్రవాహమార్గం ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క దిక్కునకు మారుతున్నట్లునూ తెలుస్తున్నది. క్రీ. శ. 1245 వరకూ చీనాబ్‌నది, ముల్తానుకు తూరుపుదిక్కున ప్రవహించినదనీ, క్రీ. శ. 1397 దగ్గరనుంచీ ఆ మార్గంతప్పి ముల్తాన్‌కు పశ్చిమంగా ప్రవహిస్తున్నదనీ చెపుతారు.

ఈ నదినిగురించి మరొక పురాణగాధకూడాఉన్నది.

చంద్రుడు దక్షప్రజాపతి కుమార్తెలను ఇరవైఏడుగురిని పెండ్లాడాడు. అయితే అందరిలోకీ రోహిణి అంటే ఎక్కువ ప్రేమగాఉండేవాడు. అందువల్ల తక్కిన భార్య లందరికీ కష్టంకలిగింది. వారు వెళ్ళి తమ తండ్రి అగు దక్ష ప్రజాపతితో చెప్పుకున్నారు. దక్షునికి చంద్రుడిమీద కోపం వచ్చి 'క్షయుడవుకమ్మ' ని శాపంఇచ్చాడు. ఆ శాపానికి భయపడి చంద్రుడు, శివునివద్దకువెళ్ళి శరణుజొచ్చాడు. శివుడు చంద్రుడికి అభయంఇచ్చి అతన్ని తన శిరస్సున ధరించడానికి పూనుకున్నాడు. అప్పుడు బ్రహ్మ దక్షుడి శాపం వృధాకాకుండానూ శివుడిచ్చిన అభయవరం నెరవేరేటట్లున్నూ ఒకఆలోచనచేసి చంద్రుణ్ణి రెండు ఖండాలుగా విభజించాడు. ఒకభాగం శివుడికిచ్చాడు. దానిని శివుడు శిరస్సునతాల్చాడు. రెండవభాగం దక్షుడి కుమార్తెలగు తారలకు ఇచ్చాడు. ఆ అర్ధచంద్రుడికి దక్ష శాపంవలన అప్పటినుంచీ వృద్ధిక్షయాలు కలుగుతూ వచ్చాయి. బ్రహ్మ, హిమవత్పర్వతాలలో ఒకచోట చంద్రుణ్ణి రెండుఖండాలుగా విభజించాడు, అలా విభజించే టప్పుడు ఆ ప్రదేశంనుండి ఒక మంచు ప్రవాహం బయలు దేరింది. అదే ఒక నదిఅయింది, చంద్రుణ్ణి భాగించే టప్పుడు జన్మించినదికనక దానికి చంద్రభాగ అని పేరు వచ్చింది. చంద్రభాగాఖ్యాం శైలాఖ్యాం ప్రభవతి చంద్ర భాగా—చంద్రభాగములనెడి పర్వతాలవలన పుట్టినది— చంద్రస్యభాగతోన్యస్తా చంద్రభాగా—చంద్రునియొక్క—

భాగమున పుట్టినది-అని అమరసింహుడు అమరకోశంలో చెప్పాడు.

చీనాబునది ఒడ్డునుండి అనేకకాలువలు త్రవ్వారు. ఈ కాలువలలో ఎక్కువభాగం పూర్వం ముల్తాన్, షూజా బాద్‌లను పరిపాలించిన పఠాన్‌రాజులు త్రవ్వించినవి. వర్షా కాలంలో నదులుపొంగి వరదనీరు వచ్చి, యీ కాలువ లన్నీ నిండిపోతాయి. కాని ఎండాకాలంలో నీరు తగ్గిపో గానే అవి ఎండిపోతాయి. యీ కాలువలను 'ఇన్‌ముడేషన్ కెనాల్స్' అని అంటారు.



# రావి

పంజాబునదులని పిలువబడే అయిదునదులలో రావీ నది ఒకటి. సింధునదికి ముఖ్యఉపనదులు అయిదు. వాటిలో రావీనదికూడా ఒకటి. తక్కిననాలుగూ - జీలం, చీనాబ్, బియాస్, సట్లెజ్—అనేవి.

వేదవాఙ్మయంలో రావీనది పరూష్ణిఅనుపేరుతోవర్ణించ బడింది. కొన్నిచోట్ల పురూష్ణిఅనికూడా పేర్కొన్నారు. యీ పరూష్ణినదినే సంస్కృతవాఙ్మంలో ఐరావతి అని ఉదహరించారు.

'ఇరావతి భవా ఐరావతీ'—అని శబ్దానికి వ్యుత్పత్తి. ఇరావతి అంటే మెరుపు. ఇరావంతం అంటే మేఘం. ఇరా—అంటే నీరుఅనికూడా అర్థం ఉన్నది. కనుక, ఇరాశబ్దంనుంచి వచ్చిందే ఐరావతి. తక్కిన పంజాబునదులలోపాటు ఐరావతినిగురించికూడా విష్ణుధర్మ సూత్రాలు, మత్స్య, వామన, వాయుపురాణాలు పేర్కొన్నాయి. యీ నది గొప్ప పుణ్యనదియనీ, యీ నదీతీరంలో పితరులకు శ్రాద్ధాలుపెట్టడం—పుణ్యలోకప్రాప్తిని కలిగి స్తుందనీ వర్ణించాయి. ఋగ్వేదం యీ నదిని పరూష్ణిగా పేర్కొని, విపులంగా వర్ణించి చెప్పింది. కాశీరాజగు సుదే వుడు అనేకమందిరాజులతో గొప్ప యుద్ధంచేశాడు. పది మందిరాజులు ఏకమై అతనిమీదికి దండెత్తివచ్చారు. ఆ

యుద్ధం దశరంజనయుద్ధం అనుపేర ప్రసిద్ధికెక్కింది. సుదేవునిభార్యపేరు సుదేవి. విశ్వామిత్రమహర్షిని పురోహితునిగాపెట్టుకుని సుదేవుడు అశ్వమేధయాగంచేశాడు. అయితే, యాగం సమాప్తి కానున్నసమయంలో వశిష్ఠ మహర్షి పురోహితుడుగా వచ్చాడు. అనేకమందిరాజులు ఏకమై సుదేవుడిమీదికి దండెత్తివచ్చినప్పుడు—అంత మందితో అతనొక్కడూ యుద్ధంచేయవలసివచ్చింది. శత్రురాజులు పరూష్ణినదివెంట—అనేకవిధాలుగా భూమిని త్రవ్వారు. ఆ నదీప్రవాహాన్ని మళ్ళించి — ఆవిధంగా సుదేవుని నాశనంచెయ్యాలని ప్రయత్నించారు. అయితే, సుదేవుడు ఇంద్రుని ప్రార్థించాడు. ఇంద్రుడు పరూష్ణినది (ఐరావతి లేక రావి) వలన సుదేవునికి ముప్పురాకుండా కాపాడాడు. శత్రురాజులు ఈ నదిఒడ్డులను కోసి—సుదేవునినగరం నదీజలంలో మునిగిపోయేటట్లు చేయాలని చూచారు. కాని, ఇంద్రునిమహిమవలన అలా జరుగక— శత్రురాజులే నశించిపోవలసివచ్చింది. సుదేవునికి విజయం చేకూరింది. ఈ కథ ఋగ్వేదంలోనిది. గంగ, యమున, సరస్వతులతోపాటు ఋగ్వేదం పరూష్ణినదినికూడా పేర్కొన్నది. పరూష్ణి అను పేరురావడానికి అనేకవిధాలుగా అర్థంచెపుతారు. పరుస్ అందే 'ఉన్ని పప్పులు అనే అర్థం వున్నది. లేదా నదియొక్క వంపులు కావచ్చు. నదీతీరాన ఉండే రెల్లుగడ్డి కావచ్చు. ఏమైనప్పటికీ, పరూష్ణి,యమునా నదులు కాశిరాజగు సుదేవునికథతో చాలా దగ్గర సంబం

ధం కలిగిఉన్నాయి. ఈ రెండునదులవద్దనూ అరసు తన శత్రువులతో పోరాడివుండవచ్చును.

పరూష్ణినదిలో స్నానంచేస్తే సమస్తపాపాలూ పోతాయని నీలమతపురాణం చెపుతున్నది.

ఐరావతినుంచే ఈ నదికి రావి అని పేరువచ్చింది. ఇది చీనాబ్, సట్లెజ్ నదులమధ్య ప్రవహిస్తున్నది. జీలం, చీనాబ్, రావి, సట్లెజ్, బియాస్—నదులు అయిదూ చివరకు పాకిస్థాన్‌లోని మిఠాన్‌కోటవద్ద సింధునదితో కలుస్తున్నాయి. పాకిస్థాన్‌లో ప్రసిద్ధనగరమగు లాహోరు రావీనదిఒడ్డుననే ఉన్నది.

రావీనది హిమవత్పర్వతపంక్తులలో దక్షిణభాగాన-కాంగ్రాజిల్లాలోని 'కులూ' ప్రాంతంనుండి బయలుదేరుతున్నది. సరిగ్గా చెప్పాలంటే, బంగల్ పర్వతాలలో రోటాంగ్‌కనుమ సమీపాన, 32°.26' ఉ.అక్షాంశ, 77°-0' తూ. రేఖాంశలమీద ఈ నదిఉత్పత్తిస్థానం ఉన్నది. నది బయలుదేరినచగ్గరనుంచి మొదట కొంతలెక్క రైనా అను పేరుతో పిలువబడుతున్నది. కాంగ్రాజిల్లా తరువాత నది, చంపాపట్టణంప్రక్కనుంచి పోతున్నది.అక్కడనుంచే దీనికి రావీనదిఅని పేరు. జమ్మునుండి సుమారు 10 కోసుల దూరంలో దీనితో తావినది వచ్చి కలుస్తున్నది. బారీదోఆబ్ కాలువ ప్రధానఏర్పాట్లన్నీ మధోపూర్‌వద్ద ఉన్నాయి. తరవాత రావీనది డేరానానక్ అనే పట్టణంపక్కనుంచి ప్రవహిస్తుంది.

1870 లో రావీసవివరదలవలన ఆ పట్టణానికీ, అక్కడున్న ముఖ్యదేవాలయానికీ పెద్ద ముప్పు సంభవించి నట్లు అక్కడిరికార్డువలన తెలుస్తున్నది. సిక్కుల గొప్ప పుణ్యక్షేత్రాలలో డేరానానక్ పట్టణం ఒకటి. గురుదాస్‌పూర్ అమృతసర్ జిల్లాలగుండా ప్రవహించిన పిదప రావీనది లాహోరుజిల్లాలో ప్రవేశిస్తుంది. అక్కడ మూడుపాయ లుగా చీలిపోతున్నది. మాంటిగొమేరిజిల్లాలో డేగ్ అనే మరోఉపనదికూడా వచ్చి ఈ నదిలో చేరుతున్నది. రావి, చీనాబ్, జీలం—ఈ మూడునదులూ కలిసిన ప్రవాహం చివరకు చీనాబ్‌అనుపేరుతోనే వ్యవహరింపబడుతున్నది. చీనాబ్‌నదీజలాలకంటె రావీనదీజలాలు ఎరుపువర్ణంగా ఉంటాయి. రావీనది మైదానాలలో ప్రవహించేటప్పుడు కూడా ఒక సన్ననిలోయగుండా పోతుంది. ఈ నది మొత్తం పొడవు సుమారు 450 మైళ్లు. చీనాబ్‌నదికంటె రావీనది ఎక్కువ సారవంతమైన ఒండ్రుమట్టిని తెచ్చి చేరవేస్తు న్నది. ఏడాదిలో దాదాపు ఎనిమిదినెలలు—రావీనదిలో అనేకచోట్ల దిగి దాటిపోవడానికి వీలుగాఉంటున్నది. నది అనేక వంకరలుతిరిగి వక్రమార్గాల ప్రవహిస్తున్నది. చంపా, డియోడర్ అరణ్యాలలోని కలపను ఎక్కువగా రావీనదిలోగుండా చేరవేస్తున్నారు. ఒక్కొక్కప్పుడు పెద్ద పెద్ద చెట్లమానులుసయితం ఈ నదీప్రవాహంలో వదిలి పెట్టి కొట్టుకునిపోయేటట్లు చేస్తుంటారు. నదిలో అడుగున

అనేకచోట్ల—మనుషులు నిలుచోడానికికూడా చాలినంత ఇసుకలేక—ప్రమాదంగా ఉంటుంది.

మన ప్రాచీనగ్రంథాలలో వర్ణించిన మద్రదేశం రావి, చీనాబ్ నదులమధ్య ఉన్నది. మహాభారతంలో పాండురాజు రెండవభార్యపేరు మాద్రి. ఆమె సోదరుడే శల్యుడు. శల్యుడు మద్రదేశాధిపతి. మహాభారతయుద్ధంలో కౌరవులపక్షంవహించి గొప్ప పోరాటంసాగించాడు. కర్ణుడికి సారథిగావుండి యుద్ధంనడిపాడు. యుద్ధంలో కర్ణుడు ఓడిపోవడానికి శల్యుడుకూడా కొంత కారణమైనాడు. కర్ణపర్వంలో ఐరావతినది (రావి) ప్రసక్తి వస్తుంది. మరొక మహాభారతయుద్ధవీరుడగు బాహ్లీకుడుకూడా మద్రదేశానికి చెందినవాడేనని భావించబడుతున్నది. యమలోకానికి పోయి భర్తను మళ్ళీ బ్రతికించుకునివచ్చిన మహాసాధ్వి సావిత్రి తండ్రియగు అశ్వపతిమహారాజు మద్రదేశాన్ని పరిపాలించాడు.

—oo:o:oo—

# బియాస్

సింధునదిఉపనదులలో బియాస్ ఒకటి.

బియాస్‌నదికి మన వేదవాఙ్మయంలో విపాశ అని పేరు. అలాగే సట్లెజ్‌నదిని శతద్రు అనుపేరుతో మన వేదవాఙ్మయం వర్ణించింది.

పంజాబునదులు—జీలం, చీనాబ్, రావి, బియాస్ సట్లెజ్—అను అయిదునదులూ పాకిస్థాన్‌లో మిఠాన్‌కోట వద్ద సింధునదితో కలుస్తున్నాయి.

విపాశ అను పేరుగల బియాస్‌నది లాహౌలీలోని రోటాంగ్‌కనుమ దక్షిణపుటంచునుంచిబయలుదేరివస్తున్నది. ఈ కనుమ పంజాబుకు ఈశాన్యదిశన హిమాలయపర్వత పంక్తులలో ఉన్నది. ఈనది ఉత్పత్తిస్థానం సముద్రమట్టానికి—13వేల 200 అడుగుల ఎత్తున—32".24' ఉ. అక్షాంశపైన. 77".11' తూ.రేఖాంశపైన ఉన్నది. జీలం, చీనాబ్ మొదలగు తక్కినన‌దులలాగానే బియాస్‌కూడా వాయవ్యదిశగా ప్రవహించి, అక్కడనుంచి దక్షిణ దిక్కుగా వంపుతిరుగుతున్నది. పగటిపూట సూర్యరశ్మికి మంచు కరిగి రావడంవల్ల సాయంత్రం అయ్యేటప్పటికి నదిలో నీటిమట్టం పెరుగుతుంది. ఈ నదిమొదట ముండీని, పిమ్మట నాడుయాన్‌ను దాటి ప్రవహిస్తున్నది. దీనికి రెండు

కాలువలున్నాయి. ఒకకాలువపేరు హోల్కా. దానిపొడవు 30 మైళ్ళు. రెండవకాలువపేరు బినాయ్. దానిపొడవు సుమారు 50 మైళ్లు — నాదుయాన్‌నుంచి బియాస్‌నది దాదాపు ఎనభై మైళ్ళదూరం వడివడిగా ప్రవహించి, తరవాత పంజాబుమైదానంలో ప్రవేశిస్తున్నది. 30°.10'-ఉ. అక్షాంశ, 75°.4' తూర్పు రేఖాంశమీద ఉన్న ఎంద్రీసావద్ద సట్లెజ్‌నది వచ్చి బియాస్‌లో కలుస్తున్నది. ఈ నది మొత్తంపొడవు 290మైళ్లు. బియాస్‌నదికి విపాశ — అని పేరురావడానికి మన పురాణగాథ ఈవిధంగా ఉన్నది —

పాశం - అంటే బంధం. విపాశ — అంటే బంధవిముక్తి కలిగించడం. పాశాలను విడదీసింది కాబట్టే, దీనికి విపాశ అని పేరు. ఇది చాలా పుణ్యప్రదమగునదియని ప్రాచీనవాఙ్మయంవల్ల తెలుస్తున్నది. విపాశకు మొట్టమొదటిపేరు ఉరంజిర అని నిరుక్తంలో ఉన్నది. పాణిని కూడ ఈ నదినిగురించి చెప్పాడు. విపాశ (బియాస్) శతద్రు (సట్లెజ్) నదులపేర్లు — ఋగ్వేదంలో చెప్పబడినాయి. ఇవి రెండూ ఎత్తయిన కొండల్లో పుట్టి-సముద్రంములో కలియడానికి, ఒకదానిప్రక్కనఒకటి తోడుతోడుగా — పరుగెత్తుకుంటూవచ్చాయని చెపుతూ, వీటిని అక్కచెల్లెళ్ళుగా? — 

ఆడుగుర్రాలుగా వర్ణించింది ఋగ్వేదం. పిమ్మట — ఇవి రెండూ రెండు తెల్ల ఆవులని చెప్పి — దూడను నాకటానికి ఆరాటపడుతున్నట్లుగా సముద్రందెసకు పరుగుతీశాయని

వర్ణించింది. అంతేకాదు. ఋగ్వేదం మరోవిషయంకూడా చెప్పింది. ఉషాదేవిరథం ఇంద్రుడివలనవిరగ్గొట్టబడిందని ఆ రథం విపాశనదిఒడ్డున పడిఉన్నదనీ చెప్పింది. ఋగ్వేదం ముఖ్యమగు సప్తనదులపేర్లు చెపుతూ—విపాశను ఆర్జికీయ అనేపేరుతో వర్ణించి—వితస్త, సుషోమ— అనే నదులతోపాటు దాన్నికూడా వర్ణించింది. విపాశనదీ మధ్యంలో వశిష్ఠశిల ఉన్నట్లు గోపతబ్రాహ్మణం చెపుతున్నది. యాస్కుడుచెప్పినప్రకారం చూస్తే—ఒకప్పుడు విశ్వామిత్రమహర్షి విపాశ, శతద్రునదులు కలిసేచోటకి వచ్చాడనీ, వెళ్ళడానికి మార్గంఇమ్మని వాటిని ప్రార్థించాడనీ తెలుస్తున్నది. మహాభారతంలో విపాశ, శతద్రు— నదులనుగురించిన కథ ఇలా ఉన్నది—

వశిష్ఠమహర్షికీ, విశ్వామిత్రుడికీ బద్ధవైరం. విశ్వామిత్రుడు సైన్యంతో వేటకు వెళ్ళాడు. వేటాడుతూ వశిష్ఠమహర్షి ఆశ్రమప్రాంతానికి చేరుకున్నాడు. అప్పుడు మహాత్ముడగు వశిష్ఠుడు భూమండలాధిపతిగా ఉంటున్న విశ్వామిత్రుణ్ణి ఆహ్వానించి - తన కామధేనువుసహాయంతో షడ్రసోపేతమైన భోజనపదార్థాలు తయారుచేయించాడు. విశ్వామిత్రుడికీ, ఆయనసైన్యానికీ—గొప్పగా ఆతిధ్యం ఇచ్చి సత్కరించాడు. కాని, విశ్వామిత్రుడికి ఒక దుర్బుద్ధి పుట్టింది. ఇంతటి ఐశ్వర్యానికి కారణమగు ఆ కామధేనువును తనకిమ్మని వశిష్ఠుణ్ణి కోరాడు. కాని, వశిష్ఠుడు

అందుకు సమ్మతించలేదు. అప్పుడు విశ్వామిత్రుడు కోపంతో కామధేనువును బలాత్కారంగా అపహరించాలని చూచాడు. కాని అది సాధ్యంకాలేదు. కామధేనువు తన దేహంనుండి మహాబలవంతులగు సైనికులను లెక్కలేనంత మందిని సృష్టించింది. వారంతా విశ్వామిత్రుణ్ని ఎదుర్కొని అతని సైన్యాలను ఓడించి హతంచేశారు. అప్పటినుంచీ విశ్వామిత్రుడు వశిష్ఠుడిపై బద్ధవైరంపూని ఆయన్ను ఏ విధంగానయినా వంచాలని ప్రయత్నంచేస్తూవచ్చాడు. వశిష్ఠుడికి ఎన్నెన్నో కష్టాలు కలిగించాడు. కల్మాషపాదుడనే రాజును బ్రహ్మరాక్షసిరూపంలో ఆవహించి, వశిష్ఠుడి పెద్ద కుమారుడగు శక్తితో—అతను కలహించేటట్లు చేశాడు. ఆ కలహంలో శక్తితోసహా వశిష్ఠుడినూరుగురుకుమాళ్ళనూ బ్రహ్మరాక్షసిరూపంలోఉన్న కల్మాషపాదుడు మ్రింగివేశాడు.ఆవిధంగా తనకుమాళ్లు యావన్మందీ నశించిపోయేటప్పటికి—వశిష్ఠమహర్షి అంతులేని దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. పుత్రశోకం భరించలేక ఆ మహర్షి ఆత్మహత్యకు పూనుకున్నాడు. ప్రాణత్యాగం చేయడానికి ఎన్నోవిధాల ప్రయత్నించాడు. కాని ఎంతచేసినా ఆయనకు చావురాలేదు. చివరకు పోయి గంగానదిలో పడ్డాడు. అయినా చావక, మళ్ళీ ప్రాణాలతో బయటికి వచ్చాడు. తిరికి ఆశ్రమానికి రాగా అప్పుడా ప్రాంతంలో ఆయనకు

రెండునదులు కనిపించాయి. వర్షాకాలం కావడంవల్ల ఆ రెండునదులూ పొంగుతూ మహోధరవడిగా పారుతున్నాయి. చుట్టుప్రక్కలఉన్న చెట్లనన్నిటినీ కూల్చివేస్తూ, భయంకరంగా గర్జిస్తూ వస్తున్నాయి. అప్పుడు వశిష్ఠమహర్షి ఆలోచించాడు, ఈ నదులలో దూకినట్లయితే తప్పక చనిపోతానసుకున్నాడు. ముందు పోయి ఒకనదిలో దూకాడు. కాని బ్రహ్మతేజస్సంపన్నుడగు వశిష్ఠమహర్షితేజస్సును భరించలేకపోయింది, ఆ నది. వెంటనే అది భయంతో నూరు విధాల పరుగులుతీసింది. వశిష్ఠుడు మళ్ళీ ప్రాణాలతో ఒడ్డునచేరుకున్నాడు. అప్పటినుంచీ ఆ నదికి శతద్రు అని పేరువచ్చింది. శత—అంటే నూరు, ద్రుతం—అంటే పారిపోవడం, ఆవిధంగా పురాణప్రసిద్ధిగన్న శతద్రు నదియే ఇప్పుడు సట్లెజ్‌నది. ఆతరవాత వశిష్ఠమహర్షి తీగెలుతెచ్చి వాటితో తన కాళ్ళూ చేతులూ గట్టిగా కట్టుకున్నాడు. ఈసారిఅయినా తప్పక చావువస్తుందని పోయి రెండవనదీప్రవాహంలో దూకాడు. కాని ఆనదిలో దూకగానే వశిష్ఠుడి బంధాలన్నీ విడిపోయాయి. మహర్షిశ్రేష్ఠుడూ, మహాత్ముడూ అగు వశిష్ఠుణ్ని చంపడానికి ఆ నది వెరచింది. ఆయన్ను మళ్ళీ ప్రాణాలతో భద్రంగా ఒడ్డునచేర్చింది. ఆ విధంగా వశిష్టమహర్షిపాశాలను విడగొట్టింది గనుక, అప్పటినుంచీ ఆ నది విపాశ—అను పేరుతో ప్రసిద్ధికెక్కింది. విపాశనదియే ఇప్పుడున్న బియాస్‌నది—

ఏమైనప్పటికీ సింధునదీ, దాని ముఖ్యఉపనదులగు జీలం, చీనాచ్,రావి,బియాస్, సట్లెజ్‌నదులూ—గొప్పనదులుగా భావించబడుతున్నాయి.





# సట్లెజ్

వేదవాఙ్మయంలో ఈ నదిపేరు సుతుద్రి. అయితే, పురాణాలలో, ఇతిహాసాలలో ఇది శతద్రు అనుపేరుతో వర్ణించబడింది. ఋగ్వేదంలో ఈ నది ప్రసక్తి రెండుచోట్ల వస్తుంది. 'బియాస్ (విపాశ), సట్లెజ్ (సుతుద్రి)—నదులు రెండూ పక్కపక్కనే ఉన్నాయి. ఇవి రెండూ పర్వతపీఠభూములనుండి బయలుదేరి—రెండు ఆడగుర్రాల లాగా ఒకదానితో ఒకటి పోటీపడి సముద్రంచేరడానికి మహావేగంగా పరుగులుతీశాయి. ఇవిరెండూ—దూడను నాకటానికి ఆతురతపడుతున్న రెండు తెల్లటి ఆవుల్లా వున్నాయి'—అని వర్ణించింది ఋగ్వేదం. ఈ నది మహా వేగంగా పరుగుతీస్తున్నందున దీనికి సుతుద్రి అని పేరు వచ్చిందని సాయనాచార్యుడు చెపుతున్నాడు.

పంజాబునదులన్నిటిలోకి తూరుపుదిశగా ప్రవహిస్తున్నది సట్లెజ్. ఇది నూరుమార్గాలలో ప్రవహిస్తున్నందున శతద్రు అని పేరుపొందినదనికూడా చెపుతారు. ఒకప్పుడు వశిష్టుడికీ, విశ్వామిత్రుడికీ బద్ధవైరం ఏర్పడింది. విశ్వామిత్రుడు—వశిష్టునికుమాళ్ళను యావన్మందినీ చంపాడు. ఆ దుఃఖం భరించలేక వశిష్టమహర్షి ప్రాణత్యాగంచేయ నడుంకట్టాడు. ప్రాణాలు పోగొట్టుకోడానికి ఎన్నో ప్రయత్నాలుచేశాడు. అయినప్పటికీ ఆయనను మరణంరాలేదు.

చివరకు తీగెలతో తన్నుతాను బంధించుకుని—బియాస్ నదిలో దూకాడు. కాని ఆ నది ఆయన్ను చంపడానికి బదులుగా—ఆయన బంధాలన్నిటినీ ఊడదీసి సురక్షితంగా ఒడ్డుకుచేర్చింది. అప్పటినుంచీ ఆ నదికి విపాశ అని పేరు వచ్చింది. వశిష్టుడు అంతటితో ఊరుకోక, హైమవతిఅని పేరుగల సట్లెజ్నదిలో పోయిపడ్డాడు. వెంటనే ఆ బ్రహ్మర్షితేజస్సుకు భయంతో చలించిపోయి సట్లెజ్నది—నూరుపాయలుగా విచ్చి పరుగులు తీసింది. అందువలన దీనికి శతద్రుఅని పేరువచ్చింది. ఇది మహాభారతంలో కథ. గ్రీకులనదియగు హూపనిస్ లేక హూపసిస్—సట్లెజ్నదితో సమానమైనదని చెపుతారు. గ్రీకుచక్రవర్తియగు అలెగ్జాండరు హిందూదేశంపై దండెత్తినప్పుడు—సట్లెజ్దాకా వచ్చాడు. ఇది దాటి ఆయనఅవతలికిపోలేదు.

యాస్కుని నిరుక్తంలోనూ,భాగవతపురాణంలోనూ సట్లెజ్ (శతద్రు) నదినిగురించి చెప్పబడింది.

'శతద్రుస్తు శతద్రుస్స్యాత్'—అని అమరకోశం రచించిన అమరసింహుడు పేర్కొన్నాడు. 'పుత్రశోకార్తం కణ్ఠేశిలాం బధ్వా ప్రవిష్టం వశిష్టం దృష్ట్వా శతధా ద్రుతా శతద్రుః'—పుత్రశోకదుఃఖితుడై కంఠానికి రాయి కట్టుకుని తనయందు దుమికిన వశిష్టునిచూచి నూరుపాయలుగా ప్రవహించింది కాబట్టి దీనికి శతద్రు అని పేరు—శతం తీక్ష్ణం ద్రుతా శతద్రుః, ద్రుగా—తీవ్రంగా

ప్రవహించేదికనక దీనికి శతద్రు అనిపేరు—అని దీనికి వ్యాఖ్య.

టిబెట్టు పీఠభూమిపైన రెండు ప్రసిద్ధములగు, పుణ్యప్రదములగు సరస్సులు పక్కపక్కనే ఉన్నాయి. ఒకటి మానసరోవరం, రెండు రావణహ్రదం లేక రాక్షసతల— దీనినే రాకాస్‌తాల్ సరస్సు అనికూడా అంటారు. పూర్వం రావణాసురుడు ఇక్కడే శంకరునిగురించి గొప్ప తపస్సు చేశాడు. మానసరోవరం - దివ్యస్థలంగా ప్రసిద్ధిపొందింది. యాభైఒక్కశక్తిపీఠాలలో ఒక శక్తిపీఠం ఇక్కడ నెలకొనిఉన్నది. సతీదేవి దక్షిణహస్తం ఇక్కడపడిందని చెపుతారు. మానసరోవరానికి 20మైళ్ళదూరాన జగత్ప్రసిద్ధమగు కైలాసశిఖరం ఉన్నది. దీని ఆకారం శివలింగంలాగా ఉంటుంది. యాత్రికులు ఇక్కడికి వచ్చి - ఈ చుట్టుప్రక్కల మువ్వయిరెండుమైళ్ళదూరం తిరిగి—చూస్తారు. ఈ యాత్ర 3 రోజులలో ముగిస్తారు. కైలాసశిఖరం సముద్రమట్టానికి 19 వేల అడుగుల ఎత్తున ఉన్నది. సట్లెజ్‌నది సుమారు 15200 అడుగులఎత్తున రాకాస్‌తాల్ సరస్సులో 30 -20'ఉ. అక్షాంశ, 80 -25' తూ. రేఖాంశల మీద జన్మిస్తున్నది. కైలాసశిఖరానికి దక్షిణపుటంచులపైన సుమారు పదివేలఅడుగుల ఎత్తున, ఈ నది వాయువ్య దిశగా ప్రవహించి పిమ్మట నైఋతిమూలకు మళ్ళి అటుపైన కన్నపక్ తోయగుండా ప్రవహిస్తున్నది. ఆ విధంగా

లోయలో దాదాపు 80 మైళ్ళదూరం ప్రవహించి, శివాలిక్, రూపర్ పర్వతపంక్తులగుండా చొచ్చుకొనిపోతున్నది. మద్వాల్‌వద్ద చీనాబ్‌నదితో కలుస్తున్నది. అవిధంగా చీనాబ్‌నదిలోకలిసిన ప్రవాహం తుదకు మితాన్ కోటవద్ద సింధునదితో చేరిపోతున్నది. సట్లెజ్‌నది మొత్తం పొడవు సుమారు 900 మైళ్ళు.

సట్లెజ్, బియాస్‌నదులు ఎండ్రీసాఅనే ప్రదేశంలో ఏకమవుతున్నాయి. అక్కడనుంచి చీనాబ్‌నదితో కలిసే టంతవరకూ - ఈ ప్రవాహానికి ఘగ్గర్ లేక ఘరా అనీ, హై అనీ పేర్లు.

సట్లెజ్‌నదినుండి కాలువలు త్రవ్వారు. సిర్‌హింద్ కాలువ రూపర్‌వద్ద ప్రారంభమై లూధియానా, ఫిరోజ్ పూర్‌జిల్లాలలో అనేకఎకరాలభూమికి నీరు అందిస్తున్నది. ఈ నది బియాస్‌నదితో కలిసినతరవాత, ఎగువ సట్లెజ్‌కాలువలు ప్రారంభమవుతాయి. అవి లాహోరు, మాంట్‌గొమేరీజిల్లాలకు పుష్కలంగా నీరు అందిస్తున్నాయి. దిగువసట్లెజ్‌కాలువలవల్ల ముల్తాన్‌జిల్లాలో అనేక ఎకరాలభూమి సాగుఅవుతున్నది. ఈ నదీమార్గం పదేపదే మారిపోతున్నట్లు తెలుస్తున్నది. అరియన్‌కాలంలో ఈ నది ప్రత్యేకంగా కచ్‌లోకి ప్రవహించినట్లు చెపుతారు. క్రీ.శ. వెయ్యవ సంవత్సరంలో ఇది హక్రా (ఘగ్గర్) నదికి ఉపనదిగా ఉన్నది. క్రీ. శ. 1245 లో ఉత్తరదిశగా

ప్రవహించినట్లున్నూ, 1796 లో చివరకు ఘగ్గర్‌నదిని వదిలిపెట్టి బియాస్‌తో కలిసిపోయినట్లున్నూ తెలుస్తున్నది. పంజాబు, రాజస్థాన్, ఢిల్లీ, రాష్ట్రాలలో వర్షపాతం తక్కువ. ఇప్పుడున్న ఆ కాలువలవల్ల పాకిస్థాన్‌కు ఎక్కువ ప్రయోజనం చేకూరుతున్నది. అందువల్ల పై రాష్ట్రాలకు నీటికొరత తీర్చేటందుకు ప్రసిద్ధమగు భాక్రా-నంగల్‌ప్రాజెక్టు నిర్మించబడింది. ఇది సట్లెజ్‌నదిపై తూర్పుపంజాబులో నిర్మించబడింది. భాక్రావద్ద ఒక ఆనకట్ట, నంగల్‌వద్ద ఒక ఆనకట్ట కట్టారు. బహుప్రయోజక నీటిపారుదలపథకాలలో ఇది ఒకటి. భారతదేశంలోకల్లా ఇది పెద్దప్రాజెక్టు.

సట్లెజ్‌నది మొదట సన్నని ఇరుకుమార్గాలగుండాను, లోయలగుండానూ ప్రవహిస్తున్నది. అలాంటి అగాధాలలో ఒకటి భాక్రావద్ద ఉన్నది. ఇక్కడ నది శివాలిక్‌పర్వతపంక్తులనుండి ఇవతలికి వస్తుంది. ఇక్కడ ప్రపంచంలోకల్లా ఎత్తయిన ఆనకట్టలు కడుతున్నారు. భాక్రాఆనకట్టఎత్తు 740 అడుగులు. ఇక్కడికి సుమారు 9 మైళ్ళదూరానఉన్న నంగల్‌వద్ద మరోఆనకట్ట కట్టారు. దీని ఎత్తు సుమారు 90 అడుగులు. ఇది దాదాపు పూర్తి అయింది. అనేక జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలుకూడా నెలకొల్పారు. భాక్రానంగల్‌ప్రాజెక్టువలన తూర్పుపంజాబు, పెప్సు, రాజస్థాన్. హిమాచలప్రదేశ్, ఢిల్లీరాష్ట్రాలకు

ఎన్నో ప్రయోజనాలు చేకూరుతున్నాయి. దాదాపు 36 లక్షల ఎకరాలభూమి సాగులోనికి రావడమేకాక, 1,44.000 కిలోవాట్ల జలవిద్యుచ్ఛక్తి లభిస్తుంది. ఈ ప్రాజెక్టుకుగాను దాదాపు 110.02 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. ఈ ప్రాజెక్టువలన దాదాపు 70 పట్టణాలకుపైగా విద్యుచ్ఛక్తి లభిస్తుంది.

సిక్కులనాయకుడగు గురుగోవిందసింగు క్రీ శ. 1708లో మరణించినతరవాత, సిక్కులు బందా నాయకత్వాన సట్లెజ్, యమునానదులమధ్యనున్న దేశాన్ని పట్టుకున్నారు. క్రీ.శ. 1824 ప్రాంతంలో సింధులోయలో ఎక్కువభాగం రంజిత్‌సింగుప్రాబల్యంక్రిందికి వచ్చింది. అప్పటికే బలంసంపాదించుకున్న ఆంగ్లేయులకూ, సిక్కులకూమధ్య సట్లెజ్‌నదిమీదవున్న సోబ్రాన్‌వద్ద క్రీ.శ. 1846 లో గొప్ప పోరాటంజరిగింది. 1857 లో ఆంగ్లేయులపై జరిగిన సిపాయీలతిరుగుబాటు ఈ నదినుండి నర్మదానదిదాకా ఉధృతంగా అల్లుకున్నట్లు చరిత్రవలన తెలుస్తున్నది.

అంబాలాకు ఉత్తరాన 60మైళ్ళదూరంలో ఈ నదీతీరాన రూపర్ అనే ప్రదేశం ఉన్నది. ఈ ప్రదేశంలో, త్రవ్వగా పురాతనవస్తువులు అనేకం బయల్పడినాయి. కంచువస్తువులు, రాగి, బంగారు, నాణాలు—అనేకం దొరికాయి. ఇవి కొన్ని క్రీ. పూ. 2 వేలుమొదలు 1400

కాలంనాటివనీ, మరి కొన్ని క్రీ.పూ. 1000నుండి 700 కాలంనాటివనీ, ఇంకాకొన్ని క్రీ.పూ. 600 మొదలు 200 కాలంనాటివనీ చరిత్రకారులు ఊహిస్తున్నారు. సంగుల కాలంలోని నాణాలు కొన్నీ, మొదటి చంద్రగుప్తుడు, వాసుదేవుల కాలంనాటి నాణాలు కొన్నీ ఈ ప్రాంతంలో దొరికాయి.

వీటినిబట్టి పురాతనమైన సట్లెజ్‌నదీతీరాన ప్రాచీన కాలంలోనేకాక, తరవాత శతాబ్దాలలోకూడా గొప్ప నాగరకత అభివృద్ధిచెందుతూవచ్చినట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

# సోన్

సోన్‌నదిని మన ప్రాచీన గ్రంథాలు శోణనది అను పేరుతో వర్ణించాయి. పైగా శోణను నదిగాకాక నదంగా పేర్కొన్నాయి. నదులు వేరు, నదాలు వేరు. నదులు స్త్రీ లింగంగానూ, నదాలు పుంలింగంగానూ భావించబడి నాయి. శోణ, సింధు, హిరణ్య, కోక, లౌహిత్య, (బ్రహ్మపుత్ర) ఘర్గారా, శతద్రు—ఈ ఏడున్నూ నదాలు.

'శోణో హిరణ్యవాహస్స్యాత్—
శోణతీతి శోణః—శోణ్ృవర్ణగత్యోః—
శోణవర్ణత్వాద్వా శోణః—
హిరణ్యం వహతీతి హిరణ్యవాహః—
వహః ప్రాపణే'—

అని అమరంలో శోణశబ్దానికి వ్యుత్పత్తి; ఎర్రని కాంతికలది కాబట్టి శోణ అనీ, హిరణ్యాన్ని వహిస్తుంది కాబట్టి హిరణ్యవాహ అనీ— ఈ నదికి పేర్లు.

సోన్ లేక శోణనది వింధ్యపర్వతపంక్తులలో అమరకంటకం (అమరకూటం) అను కొండమీద పుట్టింది. అమరకంటకం చాలా ప్రసిద్ధమైనది. నర్మద మొదలగు పుణ్యనదులు అనేకం ఆ కొండనుండే పుట్టుకొనివచ్చాయి. ఉత్తరభారతంలోని పెద్దనదులలో సోన్‌నది ఒకటి. అంతే

కాదు. గంగానదిముఖ్యఉపనదులలో సోన్‌కూడా ఒకటి. అమరకంటకపర్వతం 22°.42'ఉ. అక్షాంశ, 82°.4'తూ. రేఖాంశలమీద ఉన్నది. సోణానది తొలుత ఉత్తరంగా ప్రవహించి, తరవాత తూరుపుకు మళ్ళి, చివరకు పాట్నా వద్ద గంగానదికో కలుస్తున్నది. సోణానది పొడవు దాదాపు 487 మైళ్ళు. అనేక శతాబ్దాలకాలంలో సోణానది గంగానది తోకలిసేప్రదేశంమారుతూవస్తున్నదనిచెపుతారు.అసలుఇది గంగానదితో కలిసేప్రదేశం బంకీపూరుసమీపాన 'మేనర్' వద్దఉన్నది.సరిగ్గా ఆ తట్టునుంచిసరయూనది,ఈతట్టునుంచి సోణానది,ఒకదానికొకటి ఎదురుగావచ్చి బహుకొద్దిఎడంలో గంగానదిలో కలుస్తున్నాయి. ఒకప్పుడు సోణానది మాగధుల ముఖ్యపట్టణమగు—రాజగృహం, లేక గిరివ్రజం ప్రక్కనుంచి ప్రవహించినట్లు రామాయణంవలన తెలుస్తున్నది. రామాయణం బాలకాండ - 32వ సర్గలో శోణ నదినిగురించి విపులంగా చెప్పబడింది.

విశ్వామిత్రుడు తన యాగరక్షణార్థం రామలక్ష్మణులను వెంటపెట్టుకుని వెడతాడు - వారు ముగ్గురూ సిద్ధాశ్రమానికి పోతూ త్రోవలో ఒక సాయంకాలం శోణనదం ఒడ్డున మకాంవేస్తారు. అప్పుడు ఆ దేశం ఎవరిదని శ్రీరాముడు అడుగుతాడు. అందుకు విశ్వామిత్రుడు ఈ విధంగా చెపుతాడు—'శ్రీరామా! గిరివ్రజమనేపట్టణం ఇది. పూర్వం వసుమహారాజు దీనిని రాజధానిగాచేసుకుని పాలిం

చాడు. ఆ వసుమహారాజుభూమి ఇది. అయిదు పర్వతాలు ఈ భూమిని చుట్టిఉండడంవలన దీనికి గిరివ్రజం - అని పేరువచ్చింది. [గిరివ్రజం - అంటే పర్వతాలగుంపు]ఇది శోణనదం. ఇది మగధదేశంలో పుట్టి, మగధదేశంలో ప్రవహిస్తున్నది. అయిదు పర్వతాలమధ్య ఈ నది పుష్ప మాలికలా ప్రకాశిస్తున్నది. మహాత్ముడగు వసుమహారాజు దేశంలోనిది ఈ శోణనది. ఇది తూరుపుదేశంనుండి పడమటి తట్టుగా ప్రవహిస్తున్నది. ఈ నదీతీరానఉండే భూములు చాలా సారవంతమైనవి. ఇక్కడ ఎల్లప్పుడూ పైరులు సమృద్ధిగా పండుతాయి........ఈ శోణనదం మంచి జలం కలది. లోతులేనిది. ఇసుకతిన్నెలతో శోభాయమానంగా ఉన్నది'—అని ఇలా చెపుతాడు. మరుసటిరోజు ఉద యమే రామ లక్ష్మణ విశ్వామిత్రులు శోణనదంలో స్నానం చేసి—సంధ్యావందనాదులుముగించి—నదినిదాటివెడతారు.

రామాయణంలో వర్ణితమైన శోణనదియే సోన్‌నది. ఇది గొప్పనది అని అనేకపురాణాలు చెప్పాయి. మహా భారతంలోనూ, బ్రహ్మపురాణంలోనూ, బ్రహ్మాండపురా ణంలోనూ దీనిప్రసక్తి ఉన్నది. శోణనదికి హిరణ్యావాహ అనుపేరు రావడానికి కారణం అనేకులు అనేకవిధాలుగా చెపుతారు. హిరణ్యమంటే బంగారం. ఈనదిలోని ఇసుక ఎర్రని బంగారువర్ణంతో ఉండి, తళతళ మెరుస్తూఉండడం వలన ఆ పేరు వచ్చిందంటారు కొందరు. ప్రాచీనకాలంలో

ఈ నదీతీరాన—బంగారం కుప్పలుకుప్పలుగా దొరకడం వలన ఆ పేరువచ్చిందని చెపుతారు మరికొందరు. శోణ మహాత్మ్యంలో ఈ నదీప్రభావాన్నిగురించి విపులంగా వర్ణించబడింది. బాణాసురుడి ముఖ్యపట్టణమగు శోణపురం శోణ నదీతీరంలోనే ఉన్నదని కొందరి అభిప్రాయం. మరికొందరేమో గండకీ,మాహీనదుల సంగమస్థానంలో ఉన్నదని అంటారు. గండకీ,మాహీనదులు కలిసేచోట హరిహర నాథమహాదేవుని ఆలయం ఉన్నది. శ్రీరాముడు మిథిలా పట్టణానికి వెళ్ళినప్పుడు ఇక్కడ ఆగాడనికూడా చెపుతారు. కాని, ఒకకథమాత్రం సంప్రదాయసిద్ధంగా వస్తున్నది. భాగవతం—అష్టమస్కంధంలోగల ప్రసిద్ధమగు గజేంద్ర మోక్షణకథ—శోణపురం ప్రాంతంలోనే జరిగినట్లు చెపుతారు. ఒక గజరాజు (ఏనుగు) సరోవరంలో నీరుత్రాగబోగా—లోపలఉన్న ఒక మొసలి దానిని పట్టుకుంటుంది. ఆ విధంగా ఆ రెంటికీ గొప్పపోరాటం జరుగుతుంది. చివరకు గజరాజు తన శక్తిని కోల్పోయి—భగవంతుని ప్రార్థిస్తాడు. అప్పుడు శ్రీ మహావిష్ణువు వచ్చి–తన చక్రాయుధంలో మొసలిని సంహరించి గజేంద్రుని కాపాడతాడు.

వింధ్యపర్వతపంక్తుల్లో తూర్పుభాగానగల ఋక్ష పర్వతంలో పుట్టింది సోన్‌నది. అమరకంటకపీఠభూమి బంగాళాఖాతంవరకూ విస్తరించిఉన్నది. అందుండియే

నర్మద, శోణ, మహానది—అను ప్రసిద్ధమగు మూడు నదులు బయలుదేరివచ్చాయి. శుక్తిమతి మొదలగు ఇంకా అనేకనదులు ఋక్షపర్వతంనుండే పుట్టాయని మార్కండేయాది పురాణాలు చెపుతున్నాయి. శోణనదిని శోణానది, శోణభద్రఅని కూడా పిలుస్తారు. శోణనదిలో స్నానమాచరించినా, శోణనదీతీరంలో సంధ్యవార్చినా — బ్రహ్మహత్యాది మహాపాతకాలుసయితం నశించిపోయి, మోక్షం ప్రాప్తిస్తుందని ధర్మశాస్త్రాలు చెపుతున్నాయి.

అజమహారాజు యువరాజుగా ఉన్నప్పుడు—తన తండ్రిగారిమంత్రిని అతనిసైన్యంతో ఇందుమతికి రక్షణగా ఉండమని ఆజ్ఞాపించి, అప్పుడు తాను శత్రుసైన్యాలను అరికట్టడానికై వెళ్ళాడు. ఈ విషయం మహాకవి కాళిదాసు తన రఘువంశకావ్యం సప్తమసర్గలో చెపుతూ, గంగానదీ ప్రవాహాన్ని అరికట్టేందుకు ఉత్తుంగతరంగాలతోపొంగుతూ వెళ్ళే శోణానదివలె అజమహారాజు బయలుదేరివెళ్లాడని వర్ణించాడు. ఇక్కడ శోణ, గంగానదుల సంగమాన్ని గురించికూడా చెప్పాడు కాళిదాసు. అంతేకాదు.

అనేనచేదిచ్ఛసి గృహ్యమాణం
పాణింవరేణ్యేన కురుప్రవేశే
ప్రాసాదవాతాయన సంస్థితానాం
నేత్రోత్సవం పుష్పపురాంగనానామ్

ఓ, రాకుమారీ! నీవు ఈ రాజును (పరంతపుని)

పెండ్లిచేసుకోదలచినట్లయితే—ఈతని పుష్పపురమునందు మేడలయందలి గవాక్షములచెంత కూర్చుని చూచే అక్కడి ఉత్తమస్త్రీలకు కన్నులపండుగ కాగలదుసుమా !—

రఘువంశం - షష్ఠసర్గము
శ్లో—౨౪—

ఈమాట సునంద రాకుమారియగు ఇందుమతితో చెపుతుంది. ఇక్కడ కాళిదాసు వర్ణించిన పుష్పపురం—పాటలీపుత్రం. ఇది ఇప్పటి పాట్నా. ఇది శోణనదిఒడ్డుననే ఉన్నది.

శోణనదిఉత్పత్తిస్థానాన్నిశోణకుండఅనికూడాఅంటారు ఇది పెండ్రాకూ కెండాకూ మధ్యన ఉన్నది. శోణ,నర్మద నదులు రెండూ బ్రహ్మదేవుని కన్నీటిచుక్కలనీ— ఇవి అమరకంటకానికి ఆప్రక్కన ఒకటీ, యీ ప్రక్కన ఒకటీ రాలినవనీ—వర్ణించబడింది. శోణనది యీశాన్యదిశగా ప్రవహిస్తూ, జబల్‌పూర్, బాఘేల్‌ఖండ్, మీర్జాపూర్, షహబాద్ జిల్లాలగుండా పోతున్నది. సెంట్రల్ ఇండియాలో—యీనదితో మరో మూడు ముఖ్యఉపనదులు వచ్చి చేరుతున్నాయి. వాటిలో మొదటిది జోహిల్లానది. ఇది ఎడమవైపున వచ్చి శోణనదితో కలుస్తున్నది. జోహిల్లాకూడా అమరకంటకపర్వతంమీదనే పుట్టి బరవాలూగ్రామంచెంత శోణను కలుస్తున్నది. తక్కిన రెండు ఉపనదులు బనాస్, గోపర్ అనేవి. ఇవి సోన్‌నదికుడిపట్టునుంచి వచ్చి చేరు

తున్నాయి. మీర్జాపూర్ జిల్లాలో సోన్ నది సుమారు 8 లేక 9 మైళ్ళ వెడల్పుగల ఒకలోయగుండా ప్రవహిస్తున్నది. ఇక్కడ - రిహాండ్, కన్ హర్ - అను మరో రెండు ఉపనదులు వచ్చి శోణనదితో కలుస్తున్నాయి.

రిహాండ్ ప్రాజెక్టు ఒకటి పంచవర్ష ప్రణాళికలలో చేర్చారు. దీనివలన 2 లక్షల 40 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. అంతేకాదు. తూర్పు యు.పి. లోనూ, పశ్చిమబీహారులోనూ. వింధ్యప్రదేశ్, మధ్య ప్రదేశ్ లలో కొన్ని భాగాలలోనూ దీనివలన వ్యవసాయాభివృద్ధి, పరిశ్రమాభివృద్ధి చేకూరుతాయి.

శోణనదిలో వేసవికాలం అంతగా నీరువుండదు. కాలినడకనే నదిని దాటవచ్చును. వర్షాకాలంలోమాత్రం— యీ నది బ్రహ్మాండంగాపొంగి భయదగర్జనలుచేస్తూ మహా వేగంతో పరవళ్లుతొక్కుతూ ప్రవహిస్తుంది. దాదాపు 21 వేల 300 చ. మైళ్ళ వర్షపాతం—యీ నదిలోకి పోతుందనీ - అందువల్ల సహజంగా వరదలువస్తాయనీ— చెపుతారు. సోన్ నదినుండి అనేకకాలువలు త్రవ్వారు. బీహారులో భూములకు నీటిపారుదల యీ కాలువలమూలంగానే కొనసాగుచున్నది. షహాబాద్, గయ, పాట్నా— మొదలగు జిల్లాలకు ఇంకా నీటిపారుదలఏర్పాట్లు అనేకం చేయబడినాయి. డెహ్రీవద్ద, నదికి ఆనకట్టకట్టారు.



5)



# కోసి

మన పురాణాలలోనూ, ఇతిహాసాలలోనూ చెప్పబడిన కౌశికనదియే కోసీనది. ఇది హిమవత్పర్వత ప్రాంతంలో తూర్పుదిశను నేపాలునందు పుట్టి గంగానదితో కలుస్తున్నది. దీనిని కోసి, కూసి—అనికూడా పిలుస్తారు. దీనిఉత్పత్తిస్థానం 26०.27'ఉ.అక్షాంశ, 87०.6'తూ.రేఖాంశలమీద ఉన్నది. గంగానదిముఖ్యఉపనదులలో ఇది ఒకటి. ఈ నది మొదట్లో ఏడు చిన్న చిన్న పాయలుగా చీలింది. అందువల్ల ఈ ప్రదేశాన్ని సప్తకౌశిక—అని అంటారు. ఈ పాయలన్నీ ఒకదానితో ఒకటి అల్లుకునిఉన్నాయి. వీటిలో ముఖ్యమైనపాయలు మూడు. వాటికి సూర్యకోసీ, అరుణకోసీ, తాంబరకోసీ—అని పేర్లు. ఈ మూడుప్రవాహాలూకూడా హిమవత్పర్వతాల తూర్పుప్రాంతంనుండి—నేపాలుకు దక్షిణదిగ్భాగంలో బయలుదేరాయి. ఎత్తయిన కొండశిఖరాలగుండా జలజల ప్రవహిస్తూవస్తాయి. నేపాలునుండి బయలుదేరినతర్వాత కోసీనది మొదట నైఋతిమూలగా కొన్నిమైళ్ళదూరం ప్రవహించి, పిమ్మట దక్షిణంగానూ, ఆ పైన ఆగ్నేయదిశగానూ ప్రవహిస్తుంది. కొండలన్నీ దాటివచ్చినతరువాత నది చాలా వెడల్పు అవుతుంది. పిమ్మట గుఘ్రీనదితో చేరుతుంది. గుఘ్రీనది గంగానదికి ఉపనది.

కోసీనది 160 మైళ్ళు ప్రవహించినపిదప కొండల నుండి దిగివచ్చి, బరక్షేత్రంవద్ద బీహారుమైదానాలలో ప్రవేశిస్తుంది. మొదట ఈ నది పశ్చిమదిశకు ఒక పెద్ద ఆర్చిలా చుట్టి—తరవాత గంగానదితో కలిసేముందు తూరుపుదిశకు మళ్ళుతుంది. కోసీనది ఎవరెస్టుశిఖరం ఇరు వైపులనుండేకాక, హిమాలయాలలోని ఇంకా అనేక ఇతరశిఖరాలనుండికూడా జలాన్ని తెస్తుంది. ఈ నది యొక్క పట్టుబడిప్రదేశం (కాచ్‌మెన్ట్ యేరియా) మొత్తం దాదాపు 22,900చ. మైళ్ళు. హిమవత్పర్వతాలమీదపడిన వర్షమూ, అక్కడ కరిగిన మంచూ - ఈనదిలో అమితంగా వచ్చి చేరుతున్నాయి. పైనుంచీ బరక్షేత్రంలోకి దూకేటప్పుడు నది మహావేగంగా ప్రవహిస్తుంది. అంతులేని నీటిని తీసుకరావడమేకాక, రాసులు, రాసులుగా ఇసకను, బురదను, పెద్ద పెద్ద రాళ్ళను కొట్టుకునివస్తుంది. ఇవన్నీ నదీమార్గంలో పేరుకునిఉంటాయి. ఇలా తరుచు నీటిఅడుగునచేరిన బురదమూలంగా —ఈ నదీగమనం మారుతూవచ్చింది. అడుగున బురదపేరుకున్నందున నదీ ప్రవాహం అధికప్రమాణంలో నీటిని తీసుకవచ్చే అవకాశం లేకపోగా, గడచిన 200 సంవత్సరాలలో కోసీనది, సుమారు 70మైళ్లు పశ్చిమదిశకు జరిగినట్లుగా అంచనా వేయబడింది.

కోసీనదీగమనాన్నిగురించి రెండు సిద్ధాంతాలు

స్నాయి. కొందరు ఈ నది ఒకప్పుడు బ్రహ్మపుత్రతో కలిసేందంటున్నారు. మరికొందరేమో - ఇప్పుడు కారటోయానది ప్రవహించేమార్గమే పూర్వం కోసీనది ప్రవహించినమార్గం అని చెపుతున్నారు. అయితే, ఈ రెండు సిద్ధాంతాలుకూడా నమ్మదగినవిగాలేవు. అయినప్పటికీ— ఎలాగయితేనేం, నది క్రమేణా పశ్చిమదిశకు మళ్ళినట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

సూర్యకోసీ, భోషియాకోసీ, తాంబకోసీ, లిఖ్కాకోసీ, దుధీకోసీ, అరుణకోసీ, తాంబరకోసీ—యీ ఏడుప్రవాహాలూ కలిసి సప్తకౌశికఅనేనామం ధరించాయి. పురాణాలలో చెప్పిన వరాహక్షేత్రమే— ఇప్పుడు బరకతక్షేత్రం- అనేపేరుతో ఉన్నది. దీనిని కోకముఖ - అనికూడా పిలుస్తారు. నాథ్‌పూర్‌పైన పూర్ణియాజిల్లాలో త్రివేణివద్ద వున్నది యీ ప్రదేశం. ఇక్కడ సూర్య, అరుణ, తాంబర, కోసీ మూడు ప్రవాహాలూ ఏకమై మైదానాలలో ప్రవేశిస్తాయి. యీ కోకముఖనుగురించి వరాహపురాణం— 140 వ అధ్యాయంలోనూ, నృసింహపురాణం 65 వ అధ్యాయంలోనూ విపులంగా వర్ణించబడింది. ఇక్కడనే విష్ణుమూర్తి వరహావతారం ఎత్తినట్లు చెపుతారు. సప్తకౌశికప్రదేశాన్నే మహాకౌశికఅనికూడా పిలుస్తారు. ఇది గొప్ప పుణ్యక్షేత్రంగా చెప్పబడింది. తాంబర, అరుణ, సూర్యకోసీనదుల - త్రివేణీసంగమం గొప్ప తీర్థయాత్రాస్థలం.

కోసీనది చపలచిత్తురాలని పెద్ద పేరుబడసింది. ఇది ఒకచోట వుండదు. ఇష్టంపచ్చినవైపుకు తిరుగుతుంది. మహావేగంగా పరుగెత్తుతుంది. దీనిగమనం ఒకప్పుడు ఒకవైపు, ఇంకొకప్పుడు ఇంకొకవైపు వుండి ప్రమాదంతెచ్చిపెడుతూ వుంటుంది. తరుచుగా వరదలలో పొంగుతూవచ్చి — ఊళ్ళకు ఊళ్లు ముంచివేస్తూ, అంతులేని నష్టాన్ని కలిగిస్తూవుంటుంది. కోసీనది వరదలవలన 1875 లో నాథ్‌పూర్ పూర్తిగా కొట్టుకుని పోయినట్లు చెపుతారు. నిపానియాలోని నీలిమందుకార్ఖానా, నాలుగేండ్లలో పైన పొగగొట్టాలవరకూ ఇసుకతో పూడి పోయినట్లుకూడా తెలుస్తున్నది.

ఇరవైనాలుగుగంటలలో యీనది 30 అడుగుల ఎత్తున పొంగివచ్చిందని చెపుతారు. అయితే, నదిలో నీరు ఎప్పుడైతే బురదగానూ, ఎరుపువర్ణంగానూ వస్తుంటుందో- అప్పుడు వరదలురావడానికి అదేసూచనఅని ముందుగా తెలుసుకోవచ్చునట. వరుసగా మూడురోజులు పడమటి గాలి వీచిందీ అంటే - బ్రహ్మాండంగా కోసీనదివరదలు రావడానికి కొండగుర్తు అని చెపుతారు. ఈ నదిలో కొట్టు కునివచ్చే బురదమట్టీ, ఇసుక - మొదలయినవన్నీ నది ఒడ్డులవెంట పెద్దపెద్ద గుట్టలుగా పేరుకునివుంటాయి. యీవిధంగా పేరుకొనేమట్టీ - మశానం - సంవత్సరానికి దాదాపు 37 మిలియన్లటన్ను లుంటుందని అంచనావేశారు.

కోసీనదివరదలను అరికట్టడానికీ, నదీజలాలను సక్ర

మంగా వుపయోగించుకోడానికీ ఎంతోకాలంనుంచీ ఎన్నెన్నో ప్రయత్నాలు జరుగుతూవచ్చాయి. 1947లో దీనికోసం ఒక సంఘంఏర్పడింది. ఆ సంఘంవారు చాలా పరిశోధనలుజరిపి శాశ్వతమైన పరిష్కారమార్గాలు సూచించారు. భారతప్రభుత్వం నేపాలుప్రభుత్వంతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నది. వుభయప్రభుత్వాలూ నదీజలాలను అరికట్టడానికి పథకాలు తయారుచేశారు. నేపాలులోని హనుమాన్‌నగర్‌కు సుమారు మూడుమైళ్ళదూరంలో ఒక బేరేజీ కట్ట డానికి ఏర్పాట్లుజరిగాయి. ఈప్రదేశంలోనే కోసీనది కొండలనుండి బయటికివస్తుంది. నదికి రెండువైపులా అనేకచోట్ల—వరదలను ఆపడానికి పెద్దపెద్దకట్టలు నిర్మించ బడినాయి.

నదికి రెండుప్రక్కలా నీటిపారుదలకు కాలువలు కూడా తీశారు. ఈ ఏర్పాట్లన్నీ 1955లో ప్రారంభమైనాయి. ఇప్పుడు చాలావరకు పూర్తిఅయినాయి. ఇలా కోసీనదీ జలాలను అరికట్టడంవలన, బీహారు, నేపాలులకు ఎంతో ప్రయోజనంచేకూరుతున్నది. బీహారురాష్ట్రం తరుచు కోసీ నదివరదలకు గురిఅవుతూ వచ్చింది. ముఖ్యంగా ఉత్తర బీహారుకు ఇప్పుడా భయం చాలవరకు తొలగిపోయింది.

కోసీనదిని మనపురాణాలు, ఇతిహాసాలూ కౌశికనది అని పేర్కొన్నట్లు చెప్పాం. విశ్వామిత్ర మహర్షికి ఈ కౌశికనదితో చాలా దగ్గరిసంబంధం ఉన్నది.

కుశనాభుడను రాజుకుమారుడు గాధి. ఆయనకు మగసంతానం లేదు. ఒక కుమార్తె ఉన్నది. ఆమెపేరు సత్యవతి. సత్యవతి చాలా చక్కనిది. భృగుమహర్షి కుమారుడగు ఋచీకుడు సత్యవతిని చూచి, మోహించాడు. గాధిరాజువద్దకు పోయి సత్యవతిని తనకిచ్చి పెండ్లిచేయమని కోరాడు. కాని గాధికి అది ఇష్టంలేదు. వేదబ్రాహ్మడు, మునివృత్తిలో ఉన్నవాడు అగు ఋచీకునకు, తన కుమార్తెనిచ్చి పెండ్లిచేయడానికి మనస్కరించక—ఆ మాట నోటితో చెప్పకుండా ఒక షరతుపెట్టాడు. శరీరమంతా తెలుపు, ఒకచెవిమాత్రం నలుపు గల వెయ్యిగుర్రాలను తెచ్చి శుల్కంగాఇస్తే సత్యవతిని ఇచ్చి వివాహంచేస్తానని చెప్పాడు. ఇది ఋచీకునివలన అయ్యేపనికాదని అనుకున్నాడు గాధిరాజు. కాని ఋచీకుడు మహాముని. గొప్ప తపస్సంపన్నుడు. వెళ్ళి వరుణదేవునిగురించి గొప్పతపస్సు చేశాడు. వరుణదేవుడు ప్రత్యక్షమై వరం కోరమన్నాడు. శరీరమంతా తెలుపూ, ఒక చెవిమాత్రం నలుపూగల గుర్రాలు వెయ్యి కావాలన్నాడు ఋచీకుడు. అప్పుడు వరుణుడు గంగాజలంనుండి అలాంటి గుర్రాలను సృష్టించి ఇచ్చాడు. ఋచీకముని వాటిని తీసుకునిపోయి గాధిరాజుకిచ్చాడు. అదిచూచి గాధిరాజు మిక్కిలి ఆశ్చర్యపడినవాడై, మారుమాటాడకుండా తాను అన్నమాట ప్రకారం

తనకుమార్తెయగు సత్యవతిని ఋచీకునకు ఇచ్చి పెండ్లి చేశాడు.

వరుణదేవుడు, గుర్రాలను సృష్టించిన ప్రదేశం గంగానదికిఉత్తరాన కన్యాకుబ్జానికి సమీపంలో ఉన్నది. ఈ ప్రదేశం అశ్వతీర్థంఅని ప్రసిద్ధికెక్కినట్లుగా మహాభారతం చెప్తున్నది.

సత్యవతి ఋచీకుని వివాహమాడినతరువాత, తల్లి ఉపదేశానుసారం తనకూ తనతల్లికీ కూడా పుత్రసంతానం కలిగేటట్లు వరంఇమ్మని, ఆ మహర్షిని ప్రార్థించింది. అందుకు సరేనని చెప్పి ఋచీకముని తన తపోమహిమతో రెండు వేరువేరు పాత్రలతో రెండు చరువులు (మంత్ర పూతంగా వండిన అన్నం) తయారుచేశాడు. సత్యవతిని మేడిమ్రానును కౌగలించుకుని ఒక పాత్రలోని చరువు భక్షించమని చెప్పాడు. అలాగే సత్యవతితల్లిని రావి మానును కౌగలించుకుని రెండవపాత్రలోని చరువుభుజించ మని చెప్పాడు. అయితే పొరపాటున ఈ వ్యవహారం తారు మారయింది. సత్యవతి మేడిమ్రానుకు మారుగా రావి మ్రానును కౌగలించుకొన్నది. తన తల్లికోసం నిర్దేశించిన చరువు తాను భక్షించింది. అలాగే సత్యవతితల్లి—రావి మ్రానుకు మారుగా మేడిమ్రానును కౌగలించుకుని, సత్య వతికోసమని చెప్పిన చరువు తాను భక్షించింది. దీనిఫలి తంగా విపరీతం జరిగింది. తరవాత ఇది ఋచీకుడు తన

దివ్యదృష్టివలన తెలుసుకున్నాడు. తనమామ గాధి, క్షత్రియుడు కనుక ఆయనభార్యకు వీరశౌర్యపరాక్రమాది క్షత్రియగుణాలుగల కుమారుడు పుట్టాలనీ, తాను బ్రాహ్మడు కనుక తనభార్యకు శాంతస్వభావుడూ, బ్రహ్మవిదుడూ అగు పుత్రుడు జన్మించాలనీ ఉద్దేశించాడు ఋచీకముని. కాని, భార్యా, అత్త చేసిన పొరపాటువల్ల ఇందుకు వ్యత్యస్తంగా జరుగుతుందని తెలుసుకున్నాడు. 'నీ గర్భాన జన్మించబోయే పుత్రుడు ఉగ్రమైన క్షత్రియస్వభావంకలవాడూ, నీ తల్లికి పుట్టబోయే బిడ్డడు క్షత్రియుడైనా, బ్రాహ్మణస్వభావం కలవాడూ అవుతాడు' అని ఋచీకుడు, సత్యవతితో చెప్పాడు. అందు కామె ఎంతో విచారించింది. తన కుమారుడు కాక, తన మనమడు అలాంటి క్షత్రియ గుణాలు కలవాడయ్యేటట్లు అనుగ్రహించమని భర్తను కోరింది. ఋచీకుడు ఆమెకోరినట్లే వరం అనుగ్రహించాడు. తరవాత సత్యవతి ఒక కుమారుని కన్నది. అతనే జమదగ్ని. ఆయన గొప్ప ఋషి అయినాడు. గాధిరాజు భార్యఅగు సత్యవతితల్లికూడా ఒకపుత్రుని కన్నది. అతనే విశ్వామిత్రమహర్షి.

జమదగ్ని రేణుకను వివాహమాడాడు. వారికి పరశురాముడు జన్మించాడు. పూర్వపు వరప్రభావంవలన పరశురాముడు బ్రాహ్మణ పుత్రుడయినప్పటికీ ఉగ్రమైన

చేస్తారు. తరవాత నదిదాటి అవతలివొడ్డును పోతారు. ఈ కథ బాలకాండ 24 వ సర్గలో కనుపిస్తుంది.

అయోధ్యకాండ 49 వ సర్గలో ఇలా ఉన్నది— శ్రీరాముడు సీతాలక్ష్మణసహితుడై వనవాసానికి వెడతాడు. రాము డలా పోతుండగా మధ్యలో గ్రామాలలోని ప్రజలు చూచి ఎంతగానో దుఃఖపడతారు. రాముని అరణ్యానికి పంపిన దశరథమహారాజును పలువిధాల నిందిస్తారు. రాముడు జనులు చెప్పుకునే మాటలు వింటూ పెద్దపెద్ద ఊళ్ళూ, చిన్నచిన్న ఊళ్లూ అనేకం గడిచి చివరకు కోసల దేశం దాటిపోతాడు. తరవాత మంచినీరుగల వేదశ్రుతి అనునదిని దాటి అగస్త్యుడున్న దక్షిణాభిముఖుడై వెళ తాడు. అలా పోయిపోయి ఒడ్డులవెంట ఆవులమందలతో నిండియున్నదీ, శుద్ధజలంకలదీ, గంగాద్వారమున సముద్ర గామినీ అగు గోమతీనదిని దాటుతాడు. పిమ్మట స్యందికా నదిని దాటి — తన రథసారథి అయిన సుమంత్రు డితో ఇలా అంటాడు—'సారథీ! నేను మళ్ళీ ఇక్కడికి ఎప్పుడువస్తాను, నా తల్లిదండ్రులతోకూడి సుందరమగు సరయూవనంతో ఎప్పుడు వేటాడుతూ విహరిస్తాను?'— అని ఇలా దుఃఖిస్తాడు శ్రీరాముడు.

దశరథమహారాజు ఎడబాటును సహించలేక, కని కన్నతల్లియగు కౌసల్యాదేవి—ఎలా అంతులేని దుఃఖంలో మునిగిఉన్నదో—అలాగే సరయునది, దశరథమహారాజు

కోసం వేదనపొందుతున్నది. చల్లని గాలితాకిడికి చలిస్తున్న అల లనే హస్తాలతో ఆయనను ఆహ్వానిస్తున్నది'- అని, మరొకచోట — 'అయోధ్యానగరంలో రాజమార్గం ఐశ్వర్యంతో తులతూగుతూ మనోహరంగా ఉన్నది. సరయు నదిలో పడవలు అటూఇటూ తిరుగుతున్నాయి. అయోధ్యా పురవాసులు మహదానందంతో ఉద్యానవనాలు తిలకిస్తున్నారు. రాజభవనాల పైఅంతస్థులలోనుండి సరయునది అత్యంతమనోహరంగా కనుపిస్తున్నది. ఇసుకతోనిండిన నదీతీరంలో రాజహంసలు శోభాయమానంగా ఉన్నాయి'— అని, మహాకవి కాళిదాసు తన రఘువంశకావ్యంలో వర్ణించాడు.

మనుచక్రవర్తి స్వయంగా అయోధ్యాపట్టణాన్ని సరయునదీతీరంలో నిర్మించాడు. అయోధ్య పన్నెండు యోజనాల పొడవూ, మూడు యోజనాల వెడల్పు గల మహాపట్టణం. సూర్యవంశపురాజులకు అది ముఖ్యపట్టణంగా ఉంటున్నది. దర్శించవలసిన ఏడు పుణ్యనగరాలలో అయోధ్య ఒకటి—'అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా—' అని సప్తనగరాలు ప్రసిద్ధమైనవిగా చెప్పాడు. వాటిలో అయోధ్య ఒకటి. బౌద్ధులు అయోధ్యను పుణ్యనగరంగా భావిస్తారు. బుద్ధదేవుడు— ఆరుచాతుర్మాసదీక్షలు— అయోధ్యలోవుండే సాగించాడు. జైనులుకూడా అయోధ్యను పవిత్రస్థలంగా భావిస్తారు. ఇరవైనలుగురు తీర్థంకరులలోనూ (జైనస్వా

ములు) మొదటివాడగు ఆదినాథుడు, రెండవవాడగు అజితనాథుడు, నాలుగవవాడగు అభినందననాథుడు, అయిదవవాడగు సుమతినాథుడు, పధ్నాలుగవవాడగు అనంతనాథుడు — సరయునదీతీరంలోని అయోధ్యానగరంలోనే జన్మించారు.

రామలక్ష్మణులు సరయునదిలోనే మునిగి తమ అవతారాలు చాలించారు.



# గండకి

గండకీనది నేపాల్‌పై భాగంలో హిమవత్పర్వతాలలో డాకేపర్వతపంక్తి అడుగుభాగంలో జన్మించి, నేపాల్ గుండాను, ఉత్తరప్రదేశ్ తూర్పుభాగంగుండాను, ప్రవహించి సోన్‌పూర్ సమీపంలో గంగానదితో కలుస్తున్నది.

గంగానదికిగల ముఖ్యఉపనదులలో గండకినది ఒకటి. ఈ నది పుణ్యనదిగానే కాక, సాలగ్రామశిలలకు మిక్కిలి ప్రసిద్ధికెక్కింది. తులసి శివునివరంవలన గండకి నదిపై ప్రవహించినదని శివపురాణం చెపుతున్నది. విష్ణుమూర్తి జగన్మోహినీ అవతారంఎత్తినప్పుడు శివుడు ఆమెతో రమించాడనీ, అప్పుడు జగన్మోహినికి చెమట పుట్టినదనీ — అదియే గండకీనదిగా ప్రవహించినదనీ స్కాందపురాణం పేర్కొంటున్నది. ఈ నదిలో వజ్రమయమగు కీటకాలు ఏర్పడినాయి. ఆ కీటకాలనుండి వచ్చిన శిలలే సాలగ్రామశిలలు.

ఏమైనప్పటికీ ఇప్పుడుకూడా ఈ నదిలో ఎక్కడబట్టినా రకరకాల సాలగ్రామాలు దొరుకుతాయి. ఇవి విష్ణువుకూ, శివునకూకూడా ప్రీతికరమైనవి. కొందరు వీటిని దేవతార్చనలోపెట్టి—నిత్యం పూజిస్తారు.

గండకీనదీతీరం గొప్ప విష్ణుక్షేత్రమని భాగవతం చెపుతున్నది. భాగవతంలో ప్రసిద్ధమగు జడభరతోపా

ఖ్యానం అనే కథ ఉన్నది. భరతుడు ఈ గండకీనదీతీర మందే బహుకాలం ఉండి—తపస్సుచేశాడు. శివ, విష్ణు సాలగ్రామశిలలచే పరమపవిత్రమైన గండకీనదీతీరమున ఆశ్రమంకట్టుకుని నిత్యం హరిపూజచేస్తూవచ్చాడు. ఒక నాడు ఆయనకు గండకినదిలో ఒక లేడిపిల్ల పడి కొట్టు కొనిపోవడం కనుపించింది. ఆయన జాలిదలచి దానిని బయటికితీసి రక్షించాడు. తరవాత ఆశ్రమానికి తీసుకుని పోయి పెంచసాగాడు. రానురాను ఆయనకు ఆ లేడిపిల్ల మీద మమకారం ఎక్కువయింది. సర్వం త్యజించిన ఆ మహాత్ముడు ఇలా వొక లేడిపిల్లపై మమతపెట్టుకుని, తన హరిపూజ మరచిపోయాడు. ఆ లేడిమీదనే ప్రాణం పెట్టుకుని తుదకు దేహం త్యజించాడు. ఆ కారణంవలన భరతుడు తరవాత జన్మలో వొక లేడిగాపుట్టవలసి వచ్చింది.

బ్రహ్మమానసపుత్రుడగు పులహామహర్షి ఆశ్రమం పూర్వం గండకీనదీతీరంలోనే ఉన్నట్లు చెపుతారు. ఇటు దక్షిణదిశనుండి సోన్‌నది, అటు ఉత్తరదిశనుంచి గండకి నది, కొంచెంఎడంగా వొకదానికొకటి ఎదురుగా వచ్చి గంగానదిలో కలుస్తున్నాయి.

గండకీనది 26౦.30'ఉ. అక్షాంశ, 84౦.30'తూ. రేఖాంశలమీద ఉన్నది.

# శిప్రా

శిప్రానది మాళ్వాలోని కోక్రీబర్డీకొండలనుండి బయలుదేరి వస్తున్నది. ఈ ప్రదేశం ఇండోర్‌కు ఆగ్నేయ మూలగా—సుమారు పన్నెండుమైళ్ళదూరాన, 22°.31'ఉ. అక్షాంశ, 76°.0'తూ. రేఖాంశలమీద ఉన్నది. చివరకు శిప్రానది 23°.53ఉ. అక్షాంశ, 75°.31'తూ. రేఖాంశలమీద వున్న కాలూ ఖేరీఅనే గ్రామంవద్ద ఛేంబల్‌నదిలో చేరిపో చున్నది. ఆవిధంగా శిప్రానదిని కలుపుకుని ప్రవహించిన ఛేంబల్‌నది తుదకు యమునానదిలో కలుస్తున్నది.

శిప్రానదికి క్షిప్రానది అనుపేరుకూడా ఉన్నది.

ఇది చాలా పవిత్రమూ, పుణ్యప్రదమూ అయిన నది. పుణ్యదాయకములగు సప్తనగరాలలో ఒకటియైన అవంతీపట్టణం శిప్రానదీతీరాననే వున్నది. అవంతీపట్ట ణానికే ఉజ్జయిని అని పేరు. ఉజ్జయినీదేశానికి ఆ పట్టణం రాజధాని. చరిత్రప్రసిద్ధిగన్న గొప్పపట్టణం అది.

'ఉజ్జయిన్యాం మహాకాలం
ఓంకార మమలేశ్వరం....'

అని ద్వాదశజ్యోతిర్లింగాలతో ఒకటిఅగు మహా కాలేశ్వరుడు—అక్కడే నెలకొని ఉన్నాడు. శిప్రానది, అవంతీపురం, అవంతీమండలం, మహాకాలవనం—వీటి విశిష్టతనుగురించి స్కాందపురాణం విపులంగా వర్ణించి

చెప్పింది. అవంత్యఖండం అనుపేరుతో స్కాందపురాణ మంచు ప్రత్యేకంగా ఒకభాగమే ఉన్నది. మాల్వానుండి బయలుదేరినతరవాత శిప్రానది వాయవ్యమూలగా ప్రవహిస్తున్నది. పెక్కుచోట్ల ఈ నది వెడల్పు కాక చాలా సన్నని ప్రవాహంగా పారుతున్నది. ఒక్క మాళ్వా దిగువ భాగంలో మాత్రమే నదీతీరాలు ఎత్తు తక్కువగావుండి— ఆప్రదేశంలో నీరు వ్యవసాయానికి ఉపయోగపడుతున్నది. కాని, తక్కిన అనేకచోట్ల—ముఖ్యంగా మెహిద్‌పూర్, ఆలాట్‌లమధ్య నది ఇరుదరులూ చాలా ఎత్తుగా రాతిమయంగావుండి నీటిపారుదలకు ఏ మాత్రం ఉపయోగపడకుండా ఉంటున్నది. మాళ్వానుండి బయలుదేరి, సుమారు 54 మైళ్ళదూరం ప్రవహించినపిమ్మట శిప్రానది ఉజ్జయినీ పట్టణంప్రక్కనుండి పోతున్నది. ఈనది చాలా పవిత్రమైనదిగా భావించబడుతున్నది. నదిపొడుగునా అనేక పుణ్యతీర్థాలు నెలకొనివున్నాయి. అనేకపురాణాలనుబట్టి ముఖ్యముగా స్కాందపురాణాన్నిబట్టి నదీతీరంలో పూర్వం అనేకమంది మహర్షులూ, మునులూ ఆశ్రమాలుకట్టుకుని నివసించినట్లుగా తెలుస్తున్నది. ఈ పురాణగాథలు అనేకమంది మునులకు, దేవతలకు, రాక్షసులకు సంబంధించి ఉన్నాయి.

శిప్రానదీతీరంలో ప్రసిద్ధమగు అవంతీపురం ఉన్నట్లు కాళిదాసమహాకవి తన రఘువంశకావ్యంలో వర్ణించాడు.

అనేన యూనాసహపార్థివేన
రంభోరు కచ్చిన్మనసోరుచిస్తే
'శిప్రా'ంతరంగానిలకంపితాసు
విహర్తు ముద్యానపరంపరాసు.

6 వ వర్గ—శ్లోకం ౩౫.

అరటి స్తంభాలవంటి తొడలుగల ఓ ఇందుమతీ! యౌవనంలోవున్న ఈ అవంతీరాజుతో కూడి శిప్రానది అలలనుండి వచ్చే చల్లనిగాలితో అల్లలాడుతున్న ఉద్యాన వనాలలో విహరించడం నీ కిష్టమేనా?—అని ఈ శ్లోక తాత్పర్యం.

ఈవిధంగా కాళిదాసమహాకవి రఘువంశకావ్యంలో ఉజ్జయినీనగరాన్నీ, శిప్రానదినీ వర్ణించిచెప్పారు.

కాళిదాసు తన మేఘసందేశంలోకూడా శిప్రానదిని వర్ణించాడు. మేఘసందేశం ప్రథమసర్గ—౩౧, ౩౨ శ్లోకాలలో అవంతిపురవైభవాన్నీ, శిప్రానదినుంచి వీచే చల్లని పరిమళవాయువులగురించీ మనోహరంగా వర్ణించాడు.

పురాణాలనుబట్టి చూస్తే, శిప్రానది పారియాత్ర పర్వతంపైన పుట్టినట్లు తెలుస్తున్నది. దీనికే అవంతినది అనీ, వుత్తరదిశగా ప్రవహించడంవలన ఉత్తరవాహిని అనీ—పేర్లువచ్చాయి. హరివంశంలోకూడా ఈ నదిప్రసక్తి వున్నది.

విష్ణుదేవుని రుధిరప్రవాహంనుండి శిప్రానది ప్రవహించినట్లు భావించబడుతున్నది. కొన్ని సందర్భాలలో ఈ నదీజలాలు క్షీరంగా మారినట్లు చెపుతారు. నర్మదానది పొర్లి ప్రవహిస్తుంటే వింధ్యపర్వతాలు ఉండబట్టి ఆ ప్రవాహాన్ని ఆపగలిగాయని అంటారు. నర్మద, చర్మణ్వతి క్షత - ఈ నదులన్నీ అమరకంటక్ పర్వతంనుండి జన్మించాయి. క్షతనది వచ్చి రుద్రసరోవరంవద్ద శిప్రానదితో కలుస్తున్నది. ఆ ప్రదేశం గొప్ప తీర్థయాత్రాస్థలం. శిప్రి నదిలో శుక్ల, హవస్ఖేడీ, లంగర్ఖేడీవద్దనున్న దాశ్వ ఘట్టం—మొదలయిన అనేకప్రదేశాలు పుణ్యతీర్థాలుగా ప్రసిద్ధికెక్కి వున్నాయి.

వీరమిత్రోదయుని తీర్థప్రకాశ అనేగ్రంథం—మత్స్యపురాణాన్ని పేర్కొంటూ—ముఖంలో రెండు నేత్రాలున్నట్లుగా భూమిమీద రెండు పుణ్యతీర్థాలున్నాయని చెప్పింది. ఒకటి గంగాతీరానవున్న అవిముక్త (కాశీ) తీర్థం. రెండు శిప్రానదివొడ్డునవున్న మహాకాల(ఉజ్జయిని) తీర్థం.

శిప్రానదికి రెండు ముఖ్యమగు చిన్న ఉపనదులున్నాయి. ఒకటి ఖాన్నది. అది ఇందోర్కు దక్షిణాన ఏడుమైళ్ళదూరంలో పుట్టి గోత్రాఅనేగ్రామంవద్ద శిప్రానదితో కలుస్తున్నది. రెండవ ఉపనది గంభీర. అది వచ్చి ముల్లామూర్ దగ్గర శిప్రానదితో చేరిపోతున్నది.

శిప్రానది వొడ్డున వున్న ఉజ్జయినీపట్టణం గొప్ప

పుణ్యస్థలమేకాక, చాలా పురాతనమగు పట్టణం. శివుడు దూషణుడనేరాక్షసుణ్ణి ఈప్రదేశంలోనే సంహరించి—ఇక్కడ మహాకాలేశ్వరుడుగా వెలశాడు. శ్రీకృష్ణుడు, బలరాముడు—వారి బాల్యచెలికాడగు కుచేలునితోకూడి ఈ ప్రదేశంలోనే వున్న, తమ గురువగు సాందీపుని ఆశ్రమంలోనే సమస్తవిద్యలూ నేర్చుకున్నారు. మహాభక్తుడగు ప్రహ్లాదుడు శిప్రానదిలో స్నానమాచరించినట్లు పురాణగాధలనుబట్టి తెలుస్తున్నది. మహాభారత యుద్ధకాలంలో అవంతీపురాన్ని విందానువిందులనేవారు పరిపాలించారు. వాళ్ళిద్దరూ దుర్యోధనుడిపక్షం వహించారు. రెండు అక్షౌహిణీలసేనతో వచ్చి, పాండవులతో పోరాడారు.యుద్ధంలో అర్జునుడు వారిద్దరినీ సంహరించాడు. అవంతీపుర సమీపాన వున్న వనానికి మహాకాలవనం — అని పేరు. ఈ వనంలోనే శివుడికీ అంధకాసురుడనే రాక్షసుడికీ గొప్ప పోరాటం జరిగింది.

చరిత్రప్రసిద్ధిగన్న విక్రమార్క చక్రవర్తి శిప్రానదీతీరానగల అవంతీ (ఉజ్జయినీ) పురాన్ని రాజధానిగా చేసుకుని రాజ్యాన్ని పాలించాడు. మహాకవి భర్తృహరి కూడా ఇక్కడివాడే. అశోకుడు యువరాజుగావున్నప్పుడు ఉజ్జయినికి రాజప్రతినిధిగా పనిచేశాడు. అశోకుని కుమారుడగు మహేంద్రుడు ఇక్కడే జన్మించాడు. ప్రద్యోతవంశపు రాజులకుకూడా కొంతకాలం ఉజ్జయినీనగరమే రాజధానిగా వున్నది. ఉజ్జయినిని పరిపాలించిన చండప్రద్యోతనుడు

బుద్ధదేవుని సమకాలికుడు. చంద్రప్రద్యోతునికుమా ర్తె యగు వాసవదత్తను—వత్సదేశాన్ని పరిపాలించే ఉదయన చక్రవర్తి పెండ్లాడాడు. ఉదయన, వాసవదత్తలకథ— ప్రసిద్ధమైన మహాకవి భాసునుచే గానంచేయబడింది. ప్రద్యోత రాజులపిమ్మట - మౌర్యసామ్రాజ్యంలో అవంతీ రాష్ట్రా నికి వుజ్జయినీనగరం ముఖ్యపట్టణమైంది. ఆపైన విక్ర మార్కచక్రవర్తికి రాజధానిఅయి చరిత్రప్రసిద్ధిగన్నది.

శిప్రానదీతీరానవున్న మహాకాలవనం భూమిమీద గొప్పపుణ్యస్థలంగా ప్రసిద్ధిలోనికి వచ్చింది. చంద్రవంశ ములో జన్మించిన పురూరవచక్రవర్తి అప్సరసఅగు ఊర్వశితోకూడి యీ మహాకాలవనంలోనే విహరించినట్లు చెపుతారు.

శ్రీరామచంద్రునికుమారుడగు కుశుడు—వాల్మీకి ఆశ్రమంనుండి మహాకాలేశ్వరుని దర్శించటానికి యీ వనా నికి వచ్చాడు.

ఉజ్జయినిని పాలించిన విక్రమార్కచక్రవర్తికథలు జగత్ప్రసిద్ధమైనవి. ఆయన ఆస్థానంలో నవరత్నాలని ప్రసిద్ధికెక్కిన మహాకవులు, పండితులు వున్నారు.

ధన్వంతరి, కాళిదాసు, వరాహమిహిరుడు, క్షపణ కుడు, అమరసింహుడు, శంఖుడు, వేటలభట్టు, ఘటఖర్ప రుడు, వరరుచి - ఈ తొమ్మిదిమంది మహావిద్వాంసులు ఆయనఆస్థానంలో వున్నట్లు చెపుతారు. అయితే, చరిత్ర పరిశోధకులు - వీరంతా వేరువేరుకాలాలవారని నిరూపించి

వున్నారు. ఏమైనప్పటికీ, విక్రమార్కునికాలంలో వుజ్జయిని మహావైభవంగావున్నమాట మాత్రం సత్యం. అలాంటి వుజ్జయిని పవిత్ర శిప్రానదీతీరానవున్నవిషయం మరువరాదు.

ఇప్పుడున్న పట్టణానికి సుమారు ఒకమైలుదూరంలో పూర్వపు ఉజ్జయినీనగరంవున్నట్లు తెలుస్తున్నది. ఆ నగర శిథిలాలు ఇప్పటికీ అక్కడ వున్నాయి. శిప్రానదిలో పుణ్యప్రదమగు స్నానఘట్టాలు అనేకం వున్నాయి.పన్నెండేండ్లకొకసారి—బృహస్పతి వృశ్చికరాశిలో సంచారంచేస్తున్నప్పుడు—ఉజ్జయినివద్ద శిప్రానదీతీరాన కుంభమేళా వుత్సవం జరుగుతుంది. దేశం నలుమూలలనుండీ యాత్రికులు వచ్చి ఆ మహోత్సవం తిలకిస్తారు. వివిధమతాలకూ, సంప్రదాయాలకు చెందిన లక్షలాది సాధువులు, యాత్రికులు అక్కడికి వచ్చి - శిప్రానదిలో స్నానంచేస్తారు. అదిగాక ఏటేటా కార్తీకపూర్ణిమనాడు - ఉజ్జయినిలో వుత్సవం జరుగుతుంది. శిప్రానదిఒడ్డున హరిసిద్ధిఅను దేవత ఆలయంవున్నది. అదే కాళికాలయం. విక్రమార్కచక్రవర్తి ఇలవేల్పు ఆమె. ఆ దేవిని మెప్పించి, ఆయన ఎన్నెన్నో అద్భుతాలు చేశాడు.

పన్నెండు జ్యోతిర్లింగాలలో ఒకటిఅగు మహాకాళేశ్వరుడు శిప్రానదీతీరంలోనే నెలకొనివున్నందున - భారతదేశంలోని ముఖ్యనగరాలలో ఒకటిగా అది ప్రసిద్ధికెక్కింది.



# నవీన బాలసాహిత్యము



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B132 |
| పుస్తకం పేరు | మన వదులు 02 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C,CL,BCL,BC |
| లేని పేజీలు | 53-061 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Dhuya |
| స్కాన్ చేసినది | P.Daveen |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |